# భక్త అక్క మహాదేవి



రచయిత :

విద్యార్ణవ, సాహిత్య సరస్వతి,

నూతలపాటి పేరరాజు



Phone 21907

శైవసాహిత్య పరిషత్ శ్రీశైలం

అరండల్‌పేట 7వ లైను, గుంటూరు-2.

# మున్నుడి

ద్వాదశ జ్యోతిర్లింగములలో నొక్కఁడై జగత్ప్ర సిద్ధి గాంచిన శ్రీశైలమల్లికార్జునుని మనసార ధ్యానించి, భక్తి మెయి సేవించి, సంసారసాగర ముత్తరించి, మోక్ష మొందిన మహాభక్తు లెందఱో కలరు. వారి సంగ్రహ చారిత్ర కుసుమముల నేర్చి, మాలగాఁ గూర్చి, మల్లికార్జునుని కర్పింపఁ దలంపుగొని, నే నీ 'భక్తఅక్కమ్మ' కథను ద్వితీయ కుసుమముగాఁ గైకొంటిని.

భక్తాళి సులభశైలిలో రచింపఁబడిన యీ చిఱు పొత్తమునుజదివి, భక్తిపీయూషమునుగ్రోలి, తరింతురు గాక!

—రచయిత.

ఏ దేవునకు శిఖరేశ్వరంబు క్రాంత
లాలిత క్రీడాచల స్థలఁబు
శివ నే వేల్పు క్రీడించు కేళాకూళి
తరళ తరంగ పాతాళగంగ
యే దేవునకుఁ గూర్మి హేళాకళావతి
భ్రమరాంబ భవ్య ప్రాకారంబు
భైరవాదిక్షేత్రపాలక ప్రవరులు
ప్రవహరిఁ జరింతు రే భవ్యమూర్తి

నట్టి శ్రీమన్మహాదేవు నసుఁగుపురము
గూఢసంజీవనీవని, కుంజపుంజ
వర్ధితోన్నిద్ర కల్పద్రుమవాపి కూప
భర్మహర్మ్యోన్నతంబు - శ్రీపర్వతంబు.

శ్రీశైలము శ్రీశైలము
శ్రీశైలంబనెడు పుణ్యశీలుని మదిలో
నాశైలజాధి నాథుఁడు
శ్రీశైలనివాసుఁ డుండుఁ జేతః ప్రీతిన్.

— శ్రీ పర్వతపురాణము.
[శివనాధార్య ప్రణీతము]

# భక్త అక్క మహాదేవి

దక్షిణ భారతమున 'ఉడుతడి' యను గ్రామము కలదు. అచటి నైసర్గిక స్వరూపము చూపరులకు నయనానందకరముగా నుండును. చుట్టును పెట్టనికోటలై యొప్పు పర్వతమాలికలును, వానినుండి స్రవించు సెలయేళ్ళ ప్రవాహములును, వివిధపుష్ప, ఫల వృక్షములతో నిండిన యుద్యానములును చూడ మనోహరములై భూతలస్వర్గమనిపించును.

పండ్రెండవ శతాబ్ది ప్రారంభమున నా ప్రాంతమున జైన-వైష్ణవమతములు రెండును బాగుగా వేళ్ళుపాతి, జనులలో నైకమత్యము లేక, ద్వేషభావము నానాటికి పెచ్చు పెరిగి, అరిష్టమునకు దారితీసెను. అప్పు డడుగంటుచున్న వీరశైవమును పునరుద్ధరించుటకు 'బాగేవాడి'లో బసవేశ్వరుడు 'సంగమనాథు'నకు తనయుడై జనించెను.

ఆ కాలమున ఉడుతడి ప్రాంతమును కౌశికుడను రాజు పాలించుచుండెను.

అతడు జైనమతావలంబియయ్యు పరమత ద్వేషి కాక, ఎవరి మతధర్మములను వా రనుసరింపవచ్చునని ప్రజల నాజ్ఞాపించెను. అతని ధర్మపరిపాలనమును గాంచి, సర్వమతములవారును కౌశికుని దైవస్వరూపునిగ భావించి, మనసార ప్రేమించు

చుండిరి. కౌశికుని ధర్మపాలనమునకు - సర్వమత సమత్వ బుద్ధికి - కారణము బసవేశ్వరుని బోధామృతమే!

సకల సంపదలకు - సకల వర్ణాశ్రమ ధర్మములకు - సకల మతములకును నెలవైన ఉడుతడి గ్రామమున నిర్మలశెట్టి యను బేహారి యుండెను. అతడు శైవాచార సంపన్నుడు, శివ భక్తిపరుడు, శివశరణుల నాదరించువాడు.

సుమతి యాతని అర్ధాంగి. ఆమె అన్నివిధముల పతికి దగిన సతి. ఇరుగు పొరుగువారికి తలలోని నాల్క. పరుల కష్టములజూచి ఓర్వలేనిది.

నిర్మలశెట్టి ఆ గ్రామమందొక చిన్న అంగడి పెట్టుకొని, దానితో సంసారయాత్ర సాగించుచుండెను. అతడెట్టి విషమ పరిస్థితులందును ధర్మపథమును తప్పినవాడు కాడు. మోసము మెఱుగని వ్యక్తి, దైవమిచ్చిన దానితో తృప్తిపడువాడు. న్యాయమార్గమున నార్జించిన విత్తమునందు చాలభాగము శివశరణులకు వినియోగపఱచి, మిగిలినదానితో తన సంసారమును జరుపుకొనువాడు.

కూటగోష్ఠులగు నాపుణ్యదంపతుల కన్నిసంపదలుండియు సంతాన సంపద కఱవయ్యెను. ఆ కొఱత తమ్ము వేధించు చున్నను తాము నమ్మిన పరమశివు డేనాటికైన తమకు సంతాన భిక్ష పెట్టకపోవునా? యని మిక్కిలి నమ్మి యుండిరి.

పిల్లలు దైవస్వరూపులని యెంచి యిరుగు పొరుగు బిడ్డలను చేరదీసి, వారి యచ్చట ముచ్చటలను జూచి యానందించుచుండిరి. దానికి తోడుగ బసవేశ్వరుని ప్రబోధ మా దంపతుల హృదయఫలకముల గాఢముగ నాటుకొని, వారి సచ్చరిత్రమునకు మఱింత దోహదమొసగెను. నిర్మలకీర్తి సర్వ విధముల సార్థకనాముడై పరగుచు ప్రజల ప్రీతి చూఱ గొనెను.

*　　*　　*　　*　　*　　*

ఒకనాడు కైలాసమున పార్వతీ పరమేశ్వరులకు జరగిన వాదోపవాద ఫలితముగ పార్వతీదేవి తామసికళ భూలోకమున వనవాసియగు "మాయ" యను పేరితో మోహినీ మమకార నామకులగు దంపతులకు తనయగా పుట్టెను. అంతకుమున్న సుజ్ఞాని నిరహంకారులను శుద్ధసాత్విక దంపతుల పతిమునకు మెచ్చి, పరమేశ్వరుడు నిజాంశమున వారికి తనయుడుగా ప్రసాదించిన "అల్లము"ని దనకు వశునిగ జేసికొని, తన ప్రతిజ్ఞ నెగ్గింపుమని పార్వతి శాసించిన ఆజ్ఞ ననుసరించి. ఆ మాయావతి అల్లమునికడ కేగి, అతనిని పలు తెఱగుల మోహింపజేసి; అలమట పెట్టుటకుయత్నించి, విఫలయై కైలాసమున కేగి, తన ఓటమిని పార్వతికి నివేదించెను. ఆమె అందులకు సిగ్గుపడి తన సాత్విక కళను అల్లముని యనుగ్రహము పడసి తరించుకొనుటకు ధరణీస్థలికిబంప నుద్యు

క్తమై యందులకు దగిన క్షేత్రమును గూర్చి యోచించుచుండెను.

ఆ సమయమున నిర్మలశెట్టి దంపతులు సంతాన కాంక్షతో కుములుచుండిరి.

ఆ పుణ్య దంపతుల నిర్మల భక్తికి - సదాచార సంపత్తికి, సుచరిత్రకు మెచ్చి, పార్వతి, వారి మనోభీష్టమును దీర్ప నెంచి, తన సాత్త్విక కళను సుమతి గర్భమున నిలిపెను.

* * * * * *

తోడనే సుమతికి నెల తప్పి గర్భ చిహ్నములు పొడగట్టసాగెను. అది చూచి యామె భర్తకు దెలుప, నాత డమితానందమొంది, యా పురాణ దంపతులను పెక్కురీతుల స్తుతించెను.

ఇరుగు పొరుగు అమ్మలక్కలును ఆమె ముఖ లక్షణములను గాంచి, ఆమె గర్భధారణ మొనరించెనని సంతోషపడిరి. ఆ వార్త క్షణకాలమున ఉడుతడి యంతయు ప్రాకిపోయెను.

క్రమ క్రమముగా సుమతికి నెలలు నిండి, ప్రసవవేదన ఆరంభమయ్యెను.

ఆనాడు శుక్రవారము - సూర్యాస్తమయ సమయము సుమతి శుభ ముహూర్తమున నొక్క చక్కని యాడు బిడ్డను గనెను.

నిర్మలశెట్టి యీ వార్త విని, తోడనే అంగడి మూసి వచ్చి, సంతోషమున నెల్లరకు చక్కెర పంచిపెట్టెను.

అంత నాతడు వీర శైవ మత ధర్మానుసార మా బిడ్డకు లింగధారణ మొనర్చి గురు చరమూర్తుల పాదోదకముతో మజ్జనము చేయించి, 'శక్కమహాదేవి' యని పేరిడి, అన్న దాన మొనర్చి, యెల్లరను సంతృప్తిపఱచెను.

జంగమ...లు మున్నగు పెద్దలా బాల ముఖ లక్షణము లను వీక్షించి, ఆ బిడ్డకు సుమహోజ్జ్వల భవిష్యత్తు కలదని నుడివి, దీవించి, చనిరి.

ఆ దంపతులా బిడ్డను కంటిని ఱెప్పవలె గాపాడుచుండ నా బాల దినదిన ప్రవర్ధమానయై, తన యాట పాటనితో తల్లి దండ్రులను సంతోష పెట్టుచుండును.

సుమతికి చేయింబడిన తన ముద్దుబిడ్డను అంకతలమున జేర్చుకొని, యా బాల యుపంచుచు కనులార జూచుటయెగాని, వేఱు పని లేదు. ఆమెకు సర్వస్వమా బిడ్డయే!

కార్తాంతికులు కొందఱాబిడ్డను గాంచి మీనమేష ములు లెక్కించి 'ఈ బాల మహారాజ్ఞయగు' ననిరి. మఱి కొందఱు 'దిగంత విశ్రాంతకీర్తి నార్జించు' ననిరి. ఇక కొందఱ 'ఆలోకమున కాదర్శప్రాయ యగు' ననిరి

వారి మాటలువిన్న సిర్మశెట్టి మనసు పరిపరి విధ ముల పరుగిడసాగెను. లేక లేక కలిగిన మాయొక్క యీపా పఱుసు పెరిగి పెద్దదై తనయిల్లు విడిచిపోయిన పిదప, తాను బ్రతుకుటెట్లని యోచింపదొడగును.

దానికి తోడుగ నొకనాడు సుమతికొక కలవచ్చెను. అందు తమ ముద్దుబిడ్డకు వివాహవయసు ప్రాప్తించినట్లును, ఆమె యసమాన్య సౌందర్యమునకు తగిన వరుని వెదకుచున్నట్లును, తమ యింటిముందుగ జనుచున్న యొక విరాగినిగాంచి, తమతనయ యతనిని వెన్నంటి చనుచున్న ట్లును కలగాంచి, యందలి శుభాశుభముల నెఱుగజాలక భీతిల్లి తోడనే యాస్వప్న వృత్తాంతమును తన భర్తకు దెలుప వాతడును దిక్కుదోవక పరితాప మొందసాగెను. అతడంగ డికి పోయినప్పుడు మాత్రము వ్యాపారమగ్నుడై తనయ విషయము మఱచియుండును. భోజనముకొఱకు నింటికి వచ్చి నప్పుడు మరల నా విషయము మనమున మెదల మొదలిడి బాధనొందును. ఇట్లాదంపతులు తమ తనయ భవితవ్యతను

గూర్చి పరిపరి విధముల రోజించుచు పరితాప మొందు చుండిరి.

తమకు తనయపుట్టిన వేళావిశేష మెట్టిదో గాని. వారి వ్యాపారము దినదినమునకు పాలపొంగు వలె నుబికివచ్చు చుండెను.

దిన క్రమమున నిర్మల శెట్టి ధర్మవర్తనము - వ్యాపార శక్తి - రాజు తెలిసికొని. అతడాతని మన్ననకు పాత్రుడయ్యెను. ఆ దంపతులు తీర్థంకరుల జన్మదినమునకు రాజుచే నాహూతులై, ముద్దుబిడ్డ - అక్కమహాదేవి నెత్తుకొని కొలువుకూటమున కేగిరి. కౌశిక మహారాజా దంపతులను లెస్సగా గౌరవించి, ఉచితాసనముల గూర్చుండజేసి, యా బిడ్డ సౌందర్యమును గాంచి యాశ్చర్యపడెను. అంత నిర్మలశెట్టి ప్రభునకు ఘనముగా కానుక లర్పించి సెలవుగైకొని. భార్యా సుతలను వెంటబెట్టుకొని యింటి కేగెను.

నిరాడంబర జీవియై - భగవద్ధ్యాన తత్పరుడై - శివ శరణుల సేవాపరుడై యుండిన నిర్మలశెట్టికి ధనము కూడు కొలదిని నడతలో పరిణామము కలుగసాగెను. 'ధన మొచ్చిన - మదమొచ్చు'నను పెద్దల నుండి యుక్తియుడ సార్థకమయ్యెను. భార్యయగుసుమతి యందు మాత్రము మనుమంతయును మార్పు గలుగలేదు.

రాజాశ్రయము దొరకిన పిమ్మట, నిర్మలశెట్టి తన తనయ నొక కోటీశ్వరున కిచ్చి వివాహము చేయవలయునని మనమున నువ్విళులూరుచుండెను.

అక్కమ్మ బాల యయ్యు తమ యింటికి వచ్చు శివ శరణులు నుడువు మాటలు వినుచు నెల్లప్పుడును శివ భజన యందు నిమగ్నయై యుండెడిది, తల్లి సద్గుణములన్నిటిని ఆ బాల పుణికి పుచ్చుకొనెను జనని కంత శాస్త్రియ్యత కాబిడ్డ మంత్ర ముగ్ధయై యామెను తెప్పవాల్పక చూచుచు తానును అట్లే పాడ యత్నించుచుండెను. వయసు పైబడుకొలది ఆ బాల కుశాగ్రబుద్ధిని - మాటల నైపుణిని గాంచి యెల్లరు ముక్కుపై వ్రేలిడుకొనుచుండిరి.

## 3

ఆ నాడు అక్కమహాదేవి పుట్టిన దినము. నిర్మలశెట్టి బంధు మిత్రాదుల నందఱను విందునకు బిలిచెను.

కౌశిక మహారాజా సంగతి విని, ఆనాటి సాయంకాలము నిర్మలశెట్టి దంపతులు బిడ్డను పిలిచికొని తమ యింటికి రావలయునని వార్త నంపెను. తాను రాజు నాహ్వానమునకు ముదమొంది, తమ బిడ్డను బిలిచికొని రాజ గృహమున కేగిరి.

రాజా బిడ్డ సౌందర్యమును గాంచి నివ్వెరపడెను, సౌందర్యరాశి - విరాగికి దైవ స్వరూపిగను, కామాతురునకు చెక్కెర బొమ్మగను గన్పట్టుటయు లోకసహజము.

పుత్రితుడగు కౌశికుడా కసుగందు నెడ కామోద్రిక్తుడై యా బాలను రెప్పవాల్చక చూచిచూచి, ఎంతకును తనివి నొందక, ఆ బిడ్డను రాణివాసమునకు గొనిపోయి విరివిగా నుడుగర లిమ్మని దాదుల నాజ్ఞాపించెను.

రాజాజ్ఞ ననుసరించి వారు తోడ్తోడ నా బాలను అంతఃపురమునకు గొనిపోయి, ఆమె సౌందర్యమునకు దగిన యుడుపు లేర్చి, కూర్చి, అమూల్యాభరణములు పెక్కులలంకరించిరి. అంతలో కౌశికు డచ్చటికివచ్చి మోహాంధుడై యా బిడ్డ నెత్తికొని కపోలద్వయి ముద్దాడి విడిచెను. ఆంత దాదులా బిడ్డను గొనిపోయి తల్లిదండ్రులకడ విడిచిపెట్టిరి.

తోడనే, మహారాజచ్చటికి వచ్చి, ఆ దంపతులను గాంచి, "శివభక్తులారా! మీ యనన్యసామాన్య భక్తికి మెచ్చి, పరమేశ్వరుడు మీకొక సౌగంధిక పుష్పమును ప్రసాదించెను. అది సామాన్య పుష్పముగాదు. మహారాజులు కోరదగినది. అట్టి పుష్పమును బడసిన మీరు నిజముగా ధన్యులరు" అనెను.

ఆ వాక్యములందలి యంతరార్థమును మూఢులగు నా దంపతులు గ్రహింపజాలక 'ప్రభువుల దయ యని' యూరకుండిరి.

పార్వతీదేవి అపరావతారమై, నిగుటిలో నిప్పువలె నున్న అక్కమహాదేవి ప్రభువు పలుకులందలి గూఢ భావమును క్షణములో గ్రహించి, యతని పాపబుద్ధికి మనమున జింతించి, దాదులు పెట్టిన బంగారు నగలలో నొక్కదానిని దీని, రాజు పాదములకు దగులునట్లు విసరివైచెను, అది చూచినవారు బాల్యచేష్టయని నవ్విరి. కాని, ఆ బాల భావమెఱిగిన కౌశికుడు మాత్రి విస్మయంతయును నవ్వక, గంభీర వదనముతో నటనుండి మెల్లగా జాఱుకొనెను.

అంత నా దంపతులు బిడ్డను గైకొని యింటికేగి, జంగమారాధన గావించిరి భోజన సమయమున నా జంగములు అక్కమ్మ అవతారమూర్తి యని గుసగుసలు వోయిరి.

ఏదేవి పనిపడి సుమతి శివపూజసేయు నాలపించిన – అక్కమ్మ సహింపజాలక, తోడనే తానమాడి, మడిగట్టుకొని శివపూజ చేయ మొదలు పెట్టెను.

ఆమె యలౌకిక చర్యలను – సంభావణా క్రమమును చూచి వినుకౌతూహలమున అనుదినము పెక్కండ్రు నిర్మల శెట్టి యింటికి వచ్చుచుండిరి. వారి రాకపోకల సారంభ మామె

శివపూజ కడ్డంకి యగుచుండెను. అది చూచి, అక్కమ్మ మాటాడట మానము వహించెను. ఆ మానమందలి రహస్య మెఱుగజాలనివారు అక్కమ్మ మూగయని భావింపజొచ్చిరి. వారట్లు తలచుటయు నామెకు మేలయి, తన శివపూజకే యడ్డంకియను లేక, మనసార సాగుచుండెను.

ఒకనాడు జంగమొక్కడు వారి గృహమునకు కరుదెంచి, అక్కమహాదేవి శ్రీపాదములకు భక్తితో మ్రొక్కెను. అదిచూచి నిర్మలశెట్టి భయాశ్చర్యచకితుడయ్యెను.

చరాచర ప్రపంచమంతయు శివస్వరూపమని యెంచు జంగములకు అక్కమహాదేవి యెవ్వరో - ఆమెమాహాత్మ్య మెట్టిదో తెలియదా ;

౪

మొదటి ప్రకరణమున అల్లముని గూర్చి కొంత తెలిపి యుంటిని.

మైసూరు రాష్ట్రమున 'బళ్ళిగాది' యను గ్రామము గలదు. అందు నిరహంకారుడగు వీరనాయకుడు వసించుచుండెను. సుజ్ఞాని అతని ధర్మపత్ని. ఆ దంపతులు పరమ శివభక్తులు. వారికి పెద్దకాలమునకు శివానుగ్రహము వలన నొక పుత్త్రుడు కలిగెను. అతడే - అల్లమ ప్రభువు

అల్లముడు బాల్యముననే మృదంగాది విద్యలను నేర్చి చుట్టుపట్టుల పేరుమోసిన వాడయ్యెను. అవి యాతడు గురు

మఠుఖమున నేర్చిన విద్యలు గావు; దైవదత్తములు. అతడు తన విద్యలకు దగిన రూపవంతుడు, వసంత కంతు జయంతులను మించిన సౌందర్యశాలి. రూపమునకు దగిన స్వభావము కల వాడుగాడు; విరాగి ఆశావర్జితుడు. సంసారము హేయమని నమ్మినవాడు.

అల్లముడిప్పుడు పదునాఱేండ్లవాడు. తల్లిదండ్రు లాతనికి వివాహము సేయఁదలచి, తనయునకు దగిన కన్యకై వెదక జొచ్చిరి. అది తెలిసి, అల్లముడు విచారమొంది, యింట నుండనొల్లక, చెన్న మల్లికార్జునాలయమున కేగి, యీ దేవు నెదుట తన విద్యను ప్రదర్శించుచు మనమున కించుక యూఱట కలిగించుకొనుచుండెను.

వీరనాయకుడు తనయుని వైరాగ్యమును గుర్తించి వివాహ ప్రయత్నము మానుకొనెను. అంతట, నవమాసములు మోసి కన్న తల్లి తనయుండొక యింటివాడైన జూచి యానందింపదలచి, వివాహము మీఁద నెన్నియో విధముల కొడుకునకు చెప్పిచూచెను గాని, యది యెల్ల వ్యర్థమాయెను.

అల్లముని దైవ భక్తిని - వైరాగ్యమును గాంచి పెక్కురాతనికి శిష్యులైరి. క్రమ క్రమముగా నతనికి కీర్తిలత నల్దిక్కులకు బ్రాకి మొగ్గతొడిగి పుష్పింపసాగెను.

అల్లముడింటిపట్టున నుండనొల్లక తన విద్యా ప్రదర్శనమునకై శిష్యబృందముతో దేశాటనమునకు బయలు

కేశ్వరుని యాలయమునకేగి, యా దేవునెదుట నాట్యము చేయుచుండెడిది.

అదియొక పర్వదినము. ఆనాడు మాయ గజ్జగట్టి మధుకేశ్వరుని యెదుట నాట్యమాడుచుండెను. అప్పుడా ప్రాంతమున నున్న అల్లముడా శబ్దమును విని, సంతోషమున నచ్చటికివచ్చి, ఆమె నాట్యమున కనుగుణముగ మృదంగము వాయింపదొడగెను. సూర్యప్రభాభాసమానమైన అల్లముని ముఖకాంతిని గాంచి, మాయ మూర్ఛిల్లి, కొంతవడికి తెప్పతిల్లెను. ప్రభువాతని విద్యానైపుణ్యమున కానందమొంది, అతనిని తన తనయకు విద్యాగురువుగా నొనర్చెను.

దినములు గడచుకొలది మాయకు అల్లముని యెడ ప్రేమ యతిశయించెను. ఇక నచ్చటనుండుట పాడిగాదని తలంచి, అల్లముడు రహస్యముగ నటనుండి పోయి శూన్యసింహాసన మధిష్ఠించి, ప్రజలకు శివతత్త్వమును బోధింప మొదలు పెట్టెను.

అల్లముని గానక పరితపించుచు నడవుల వెదకబోయిన మాయ - మరలి యింటికి రాలేదు. ఎందేగెనో యా మల్లికార్జునునకే యెఱుక !

౫

అక్కమ్మ చిన్ననాటనే శ్రీ మల్లికార్జునుని కృపా విశేషమున సమస్త శాస్త్రములు పుక్కిలించివైచెను. ఎల్ల

యము నెత సమ్ముఖత్వము చూపుచుండెను. ఆమె మనోగత మును నిక్కముగ నెఱిగిన వారెవ్వరు? ఆ ముక్కంటికే యెఱుక.

ఆ వీట నెందు వినను అక్కమ్మ సుద్దియే! ఆమె వర్ణనాగాలను వినినకొలది కౌశికుని దేహము మఱిమఱి పులకించుచుండెను. ఆమె దివ్యమంగళ రూపమే యాతని యెదుట సర్వదా తాండవించుచుండినటులు తోచుచుండెను. అద్దాల లోనిబిడ్డనే ప్రేమించి ముద్దాడిన ప్రభువు – వయసు వచ్చుచున్న అక్కమ్మ నిప్పుడు విడిచిపెట్టునా?

౬

అక్కమహాదేవి సౌందర్యమునకు ఆరిగాపైన కౌశికుడు ఒక్క నిముసమైనను ఆ సుందరాంగిని చూడక యుండలేక పోయెను. ఆమె యందలి తన పెల్లిదమున సర్వము విస్మరించి, తుదకు తానెవ్వరో యెఱుగజాలని స్థితికి వచ్చెను. ఎటు మెదలినను – ఎటు చూచినను ఆ దివ్యమంగళ విగ్రహము తప్ప ఆతనికి వేఱొండు కానరాకుండెను. ఆ కారణమున నతడు చిత్తశాంతిలేక వెఱ్ఱివానివలె నింట మెలగజొచ్చెను. ఆతడా మనోవ్యధను భరింపజాలక, వేట నెపమున కొంతకాల మూరువిడిచిపోవ నిశ్చయించి, తన మనోభీష్టమును మహాప్రధాని కెఱుకపఱచెను. ఆతడు రాజాజ్ఞ మేరకు, తత్కాలమున వేటకు సర్వము సిద్ధపఱచెను.

శుభముహూర్తమున ప్రస్థానభేరి మ్రోగెను. తోడనే కౌశికుడు మృగములను, జాగిలములను వెంటబెట్టుకొని వేటకు పయనమై పోయెను.

**అదియొక దట్టంపుటడవి.** గగనచుంబిత వృక్షజాలములతో - వన్యమృగ భీకరారావములతో - కోడెనాగుల ఫూత్కారములతో చూడ భయంకరముగా నుండెను. కౌశికుడు వానినెల్లను గోటమీటి, నిశితశరములు గుప్పించి, కరి శరభ సింహ శార్దూలాదులను కుప్పలుగ కూల్చెను.

ఇట్లా వేట పెద్దకాలము సాగెను.

అంతలో వసంతోత్సవ సమయ మాసన్నమయ్యెను. ఆ సమయమునన్నైన అక్కమహాదేవిని కనులార జూచి యానందింపవచ్చునని తలచి, కౌశికుడు వేటచాలించి, సిబ్బందితో పురమునకు పయనమాయెను.

ప్రభువు వేటనుండి మరలివచ్చుచున్నాడన్న వార్త తెలిసి, మహాప్రధాని పురము అమరావతిని పురుడించు తెఱగున అలంకరింపజేసి, తోడితేర మంగళవాద్యములతో ఎదురేగెను.

తమ రాజును జూచువేడ్కతో పౌరులెల్లరు రాజవీధిని నిరువైపులను బారులుతీరి నిలిచియుండిరి. గజారూఢుడై చనుచున్న రాజదృష్టి కాగుంపునం దెచ్చటను అక్కమ

కనిపింపలేదు. అంతలో నిర్మల శెట్టి గుంపునుండి ముందునకువచ్చి ప్రభువు కంఠమున పుష్పహారము వైచెను. సుమతి హైముపది చేసెను. వారి వెంటనున్న అక్కమ్మ తెప్పపాల్పక తనవైపు చూచుచున్న భూపతిని జూచి మొగము చిట్లించుకొనెను. అప్పుడును ఆ బాల మొగము పూర్ణిమా చంద్రబింబము వలె శోభగల్గెను.

కౌశికు డట్టులో యిల్లుచేరెను గాని. యతని మనసు మనసులో లేదు. తోడనే, యతడాలోచనా మందిరముకేగి, మహాప్రధానిని రావించి, యతనికి దన మనోరథము దెలుప, నాతడు వేగులోపల సర్వము సిద్ధపఱతునని ప్రభునకు విన్నవించెను. ఆ పలుకులకు రాజు సంతసించి, యా రాత్రి సుఖముగా నిద్రించెను.

కౌశికమహారా జరుణోదయముననే మేల్కాంచి, కాలకృత్యములు దీర్చికొని, జిన దేవునకు భక్తితో మ్రొక్కి, తా దలపెట్టిన కార్యమునుగూర్చి తన చెంత చనవుతో మెలగెడి దాదికి దెలిపి అందులకు సాయపడ నామెను కట్టడిచేసెను. అప్పుడామె 'చిత్త' మని నుడివి 'ఇదియేమి అగడము ? వృద్ధుడగు తానేడ ? బాలయగు అక్కమ్మయేడ ? వయసున విద్దఱకు నెంతి యంతరము! ధర్మరక్షకుడగు రాజున కిట్టి దుర్బుద్ధి పుట్టదగునా ? కంచెయే చేనుమేసిన దిక్కుగలదా ?' యని మనమున తలపోసి, రాజాజ్ఞ గొని యచ్చోటువీడి చనెను.

అంతలో నటకు మహామంత్రి వచ్చి, రాజ మర్యాదలతో నిర్మలశెట్టి యింటికేగ పరిచారకులు తమ యాజ్ఞకై వేచియున్నారని మనవిజేసి, మొదలగాని, పురోహితులను వెంటబెట్టుకొనిపోయి, యేలిక మనోభీష్టమును నిర్మలశెట్టికి విశదపరచెను.

ఆ వృత్తాంతము విన్న నిర్మలశెట్టి దంపతులు కొంత వడి నిశ్చేష్టులై తెప్పరిల్లుకొని. 'అయ్యో! ప్రభువు కెట్టి దుర్బుద్ధి పుట్టెను? అతని వయసేడ? మా ముద్దుబిడ్డ వయసేడ? హస్తి మశకాంతరము. చూచిచూచి. మా ముద్దుతల్లిని - ప్రేమైక రాశిని వృద్ధ జంబుకము చేతిలో పెట్టుటెట్లు? ధర్మపరుడని పేరొందిన ప్రభున కిట్టి దుర్బుద్ధి పుట్టనగునా? అది మా దురదృష్టము. ఇప్పుడు చింతించి ఫలమేమి? రాజాజ్ఞ మీఱరానిదని పరిపరి విధముల యోజింపదొడంగిరి.

వ్రేలుచూపిన మ్రింగు శక్తిగల అక్కమాంబ క్షణమాత్రమున తల్లిదండ్రుల పరితాపము గ్రహించి, తానే ముందునకు వచ్చి, పురోహితులను గాంచి, "పూజ్యులారా! రాజు వాంఛను - రాజాజ్ఞను నా తల్లిదండ్రులకు దెలిపి, మీ కర్తవ్యము నెఱవేర్చుకొంటిరి. అట్లే కానిండు. రాజు దైవసముడని పెద్దలందురు. అతని ఆజ్ఞ మీఱరానిది. కాని, నా కొండు కోర్కి గలదు. అది తీరిన పిమ్మట ప్రభువును వివాహమాడుట కే యడ్డంకియును లేదు. రాజుతో రహస్యముగ

మార్గాడ దలచితిని. అందులకు తగు నేర్పాటు చేయుము" యని నుడివి, వారు ప్రీతితో దెచ్చిన కానుకలు గొనెను.

అంత వారు "అట్లె కావింతుము" మని చెప్పి, ఆమె బుద్ధి వైశద్యమునకు మెచ్చుకొనుచు మరలిపోయిరి.

అక్కమ్మ ధైర్య సాహసములకు - వాక్య చతురతకు తల్లి దండ్రులు సంతసించిరి కాని, వయసు చెల్లిన ప్రభువునకు లోకైక సుందరియగు తమ కూతునీయ మనసొప్పక వగచిరి. మిగుల మిక్కిలి తమకూతు రా ముసలితొక్కుచు పరిణయమాడ సమ్మతించుటకు ఆశ్చర్యపడిరి.

౭

పురోహితులు అక్కమహాదేవి కోరికను దెలుప ప్రభువు సంతసించి, యామెకు రహస్యముగ దోడితేర దాదిని నియమించెను. ఆ దాది రాజు నాజ్ఞను శిరసావహించి, అక్కమహాదేవిని సంకేతస్థలమునకు రహస్యముగ దోడ్కొనిపోయెను. రాజచ్చోట నామెకొఱకు వేచియుండెను.

అందామెకు సంతోషముగూర్ప సమర్పించిన వివిధ పదార్థములను గాంచి యామె యేవగించుకొనెను.

అక్కమహాదేవి లోపల ప్రవేశింపగనే దాదులెల్లరు వెలుపలికి వచ్చిరి. అక్కమ్మయు కౌశికుఁడును కొన్ని క్షణములు నేమియు మాటాడక మిన్నకుండిరి

అంత, అక్కమహాదేవి ప్రభువు అంతరంగమును గ్రహించి "మహారాజా! మీకోర్కెను దీర్ప నే నెల్ల వేళల సంసిద్ధను. అట్టులే మీరును అరమరలేక నా కోర్కెను దీర్ప సంసిద్ధులు కావలయు" ననెను.

ఆ మాటకు రాజు "అందుకు సంశయమేల? అది యెట్టి దైనను తీర్ప సంసిద్ధు"నని బదులుచెప్పెను.

"అట్లయిన పరిణయమునకు తొందరయేల? పెద్దల యెదుట ప్రతిజ్ఞ సలిపిన నేను మాట తప్పుదునా? అది సజ్జన మార్గమా?" అని అక్కమ్మ అనెను.

ఆ మాటకు కౌశికుడు హర్షించి, పారవశ్యముతో, మనసు విప్పి చూపుచున్న యీ సుందరాంగి మాట నమ్మ కుండుటెట్లు? మనమున నిశ్చయించి, "నీ మనోభీష్టమును దాపక తెలుపుము. తప్పక తీర్చెద" నని నమ్మబలికెను.

అంత, అక్కమహాదేవి రాజను ప్రేమతో జూచుచు నిట్లు చెప్పదొడగెను.

"మహారాజా! నేను వీరశైవ ధర్మానువర్తిని; మీరు జైనధర్మావలంబికులు. ఇరువురకును ధర్మమొక్కటె యైనను ఆచారవ్యవహారములందు వ్యత్యాసములు కలవు. ఎవరి ఆచార ములు వారివి. శివపూజ విషయము పొడకట్టినపుడు మీరు అధికారబలమున మొలకొల్పవచ్చును. కావున, ఆచార నిర్వహణమున నెవరికిని

ఎట్టి యభ్యంతరమును లేదను విషయము వివాహమునకు ముందే తెల్పుకొనుట లెస్స. వివాహము స్త్రీపురుష సమ్మేళనమునకు వ్యావహారిక సంస్కారము కాని, నైతిక దిగ్బంధనము కాదను విషయము విస్మరింపరానిది. సతీపతు లొండరుల తమతమ మనోభావములకు విరుద్ధముగ వర్తించుటయే మానవ ధర్మము.

అక్కమహాదేవి పలికిన పలుకులకు కౌశికుడు ముగ్ధుడై, 'ఆహా! ఏమి యీ బాల జాణతనము! ఇంత లేబ్రాయముననే యిట్టి ధర్మ వచనములా? ఇది యంతయు నీమె ప్రాగ్జన్మ సుకృతి విశేష'మని మనమున దలపోసి, 'ఇంతటి చిఱుప్రాయముననే యిట్టి ధర్మబుద్ధి నీకేర్పడుట నీ పురాకృత సుకృతమనవలెను. నయము చెల్లిన నాబోటి వానికి సహిత మిట్టి యున్నత బుద్ధి యలవడదు నీవు సన్నుతించదగిన దేవివో నిర్భయముగ సంకోచపడక యెడుగుము ధర్మ పథమున వర్తించుట కే లోటును కలుగ'దని నిష్కర్షగ తెలిపెను.

ఆ మాటలు విని, అక్కమహాదేవి కౌశికుని హృదయ పరివర్తనమున కించుక సంతసించి, ఆనాటికి సంభాషణము చాలించి, మరునాడు వత్తునని చెప్పి, ప్రభువుకడ సెలవుగైకొని గుప్తమార్గమున నింటికేగి, విచారగ్రస్తులై యున్న తల్లిదండ్రుల కిట్టి వృత్తాంతమును తెలుప వారు సంతసించిరి.

మఱునాఁడు అక్కమహాదేవి నిర్ణీత సమయమునకు కౌశికుని కడకేగెను. ఆమె మనోహరాకారమును జూచి యతడు మైమఱచి, దానామెను తన బాహు వల్లికలతో బంధింప నుద్యమించెను. అప్పుడామె పాతనున్న దాని యద్దు వచ్చి, "మహారాజా! తొందర పడకుము మీ వాంఛ దీర్చుకొను సమయము మించలేదు. రాత్రి రాజ నీతికి బాహిరముగ వర్తించుట తగదని మనవి చేసెను

కౌశికుడప్పుడించుక కన్నులు తెఱచి, తానొడిగట్టిన యకార్యమునకు సిగ్గిలి అక్కమ్మను ఆ నాటికి ఇంటికి బంపివైచెను.

అంతట కౌశికుడు నిర్మలశెట్టిని పిలువనంపి, అతనిని పురోహితులతో ముచ్చటించి శీఘ్రమే వివాహ ముహూర్తమును పెట్టింపుమని నుడివి పంపెను. శెట్టి మార్గమధ్యమున పురోహితుల గృహములకేగి. వారికి రాజాజ్ఞను తెలిపి, చనెను.

౮

ముహూర్తము నిర్ణయింపబడి. పెండ్లి పనులు చుఱుకుగా సాగుచుండెను. పెండ్లికూతును జూచి వేడ్కతో పుర జనులు నిర్మలశెట్టి యింటికి విరామములేక వచ్చుచు పోవుచుండిరి.

అక్కమహాదేవి వివాహామునకు పూర్వమే కౌశికునితో కొన్ని విషయములను గూర్చి మాట్లాడదలచి అందులకు దగు దినమును నిర్ణయించుకొని దాదిని వెంటబెట్టుకొని ప్రచ్ఛన్న వేషమున కౌశికుని యింటికి పోయెను.

తోడనే యామె రాజునకు తన రాకను తెలిపి యడిగెను, తానడుగు ప్రశ్నలకు తగు సమాధానము వచ్చినచో తాను, వివాహమునకు నొడబడునని నిక్కచ్చిగా రాజునకు దాదితో చెప్పిపంపెను. ఆ వార్తవిని, రాజు సంతసించి, వానిలకు సమ్మతించెను.

అంత, అక్కమహాదేవి రాజును గాంచి "ప్రభూ! నేను వీరశైవధర్మానువర్తినియని మున్నె మీకు తెలిపియుంటిని, నా మతధర్మము ననుసరించి నే ననుదినము గురులింగ జంగమపూజ - ఇష్టలింగార్చన - లింగధ్యాన యోగమును గావించుచు నింట పురాణప్రవచనము సాగింపవలసియుండును, ఇవి నా మతధర్మములు. వీని నెప్పట్టునను విడువరాదు. మీరు వీనికెట్టి విఘ్నమును గలిగింపరాదు. ఇంకొక్కమాట వినుడు, శివశరణులను, జంగములను మీరెట్టి విషయమునందును నిందింపరాదు నా సమ్మతిలేనిది నన్ను మీరు ముట్టరాదు. ఈనియమములను తప్పి వర్తింతురేని, నేను మీతోడి సంబంధమును తెగగోసికొని, శ్రీశైల మల్లికార్జునుని చేరబోయెద" నని ఖండితముగ జెప్పెను.

ఆ మాటవిని రాజు అవనతవదనుడై కొంతసడి యోచించి అక్కమహాదేవిని గాంచి "ఇంతీ! నీ నేమములను వింటిని. మని కెట్టి యడ్డ కులును కలుగనట్లు వర్తింపజూతును. ఒక వేళ పొరపాటున నేదేని పొసగిన నన్ను విడిచిపోజనదని వేడు చున్నాను. నీ సౌందర్యమును గాంచి విడువజాలక యీ మాప్పన నిన్ను చేపట్టనలచితి"నని నుడివి యటనుండి లేచి యంతఃపురమున కేగెను.

వచ్చినపని నెఱవేఱెనని సంతసించి, అక్కమహాదేవి గృహమునకేగి శ్రీశైల చెన్నమల్లికార్జునుని పెక్కువిధ ముల కీర్తించెను.

పరిణయమునకు వచ్చిన బంధుమిత్రులలో కొందఱు భిన్నమతములు కలయికకు మనసార పాటుపడుచు వధూ వరులు కాబోవు అక్కమాంబా కౌశికులను వేవిధముల కొని యాడిరి.

అదేమి చిత్రమో! వివాహ ముహూర్తము సమీ పించుకొలది అక్కమ్మలో మార్పు పొడగట్టసాగి, వైరాగ్య సూచనలు చూపట్టెను. ఆమె బాల్యముననే తనపవిత్ర దేహ మును పదునారవయేట శ్రీశైల మల్లికార్జున కర్పించెనను విషయ మితరు లెఱుగరు. తుమ్మెద పూవుపై వ్రాలి యందలి మకరందమును గ్రోలినసిమ్మట నా పువ్వు మెట్లగపడునో - అట్లే శివార్పిత హృదయయగు అక్కమ్మయు జ్ఞానదృష్టులకు

గన్పట్ట సాగెను. కామాతురుడగు కాశికునకు మాత్ర మట్లు గాక, ఆమె రూపుదాల్చిన సౌందర్యాశియో యనతోచెను.

వివాహమునకు సర్వము సిద్ధమాయెను సుముహూర్తము సమీపించెను.

చుట్టుబట్టున గల రాజు లెల్లరు కాశికుని వివాహమునకు తమ ప్రతినిధులతో ఘనముగా కానుక లంపిరి. వివాహ మతి వైభవముగా జరిగెను. కాని కాశికుని హృదయ మిప్పుడు సంతోషవార్ధి నోలలాడక చింతా సముద్రమున మునిగియుండెను. ఇప్పుడాతనికి అక్కమహాదేవి వివాహ మాడుట చిచ్చును వడిగట్టుకొన్నటున్నది. అన్ని నిర్బంధము లతో గూడిన పెండ్లి మఱి యెట్టిదగును ?

సదస్యులు వధూవరుల నాశీర్వదించిరి. ఈడుగరులు చదివించిరి. అంత లోకాచారము ననుసరించి సుమతి తన కూతునకు జరుపవలసిన మర్యాదలు జరిపి ఆమెను అత్త వారింటికి బంపెను.

అంతట ప్రసన్నచందన తాంబూలాదులు స్వీకరించి యెల్లరు తమతమ గృహముల కేగిరి.

౯

కాశికుని కోరిక నెఱవేరెను. అక్కమహాదేవి గృహిణి యయ్యెను. ఆమె లోకమునకు కాశికుని దేవేరియే కాని

నిజమునకు చెన్నమల్లికార్జునుని హృదయేశ్వరి, పరమ విరాగిని. అట్టి విరాగినిని వివాహమాడి యాతడనుభవించు సుఖమేమి? ఆమె కోరిన కోర్కెలు నెఱవేఱిననాడు కదా ఆమె తన భార్యయని యాతడు సంతోషపడుట!

శోకాగ్నితప్తుడగు కౌశికుడు ప్రధానమంత్రిని పిలువనంపి "మంత్రివర్యా! ఏఱి కోరి చేసికొనిన యీ భార్య వలన నా సంసారము ఊచముట్టుగ పాడైనది. నేను పెనిమిటినే కాని భార్యయను మాటకు సహితము నాకర్హత లేదు. ఇక సుఖ మెటనుండి వచ్చును? పెద్దఱికమునకు పోయి బొక్కసములను వట్టివి చేసికొంటిని. చూఱగొన్న ప్రజల ప్రేమను పోకార్చుకొంటిని. నాకు మిగిలినది దుఃఖ మొక్కటియె, వికల మనస్కుడెట్లు రాజ్యమును పాలింపగలడు? నాకు కొంత కాలము విశ్రాంతి కావలయును. నీవె రాజ్యభారము వహించి ప్రజలకు సుఖము కలుగజేయు" మని నిర్దేశించెను.

ప్రధాని యేలిక మనోదుఃఖమును గ్రహించియు దానిని పోకార్చుకొను నుపాయము తోపక కొట్టుమిట్టాడు చుండెను.

అక్కమహాదేవి మూడు ముళ్ళుపడి రాణియై రాజభోగము లనుభవించు చున్నను అంతరంగమునం దెట్టి మార్పును గలుగలేదు, యథావిధిని చెన్నమల్లికార్జునుని పూజాదులు జరుగుచుండెను.

అది రాజ గృహ మగుటచే జంగములు ఆవృలు మున్నగు వా రచ్చటికి వచ్చుటకు మొదట జంకుచుండిరి. పిమ్మట అక్కమ్మ చూపు నాదరము పురస్కరించుకొని వా రెల్లరు వీత భీతులై రాజనగరికి రాదొడగిరి!

అక్కమహాదేవి కౌశికునకు నద్దుల భార్య యగుటచే నామె చేయు కార్యముల కెవరును అడ్డు చెప్పువారు లేరు జైనాచార వరులగు రాజు పరిచారకులకు ఆమె చేయు శివ పూజలు చెవ్వు శివ గాథలు కొలది కాలముననే విసుగు వేసటలు కలిగించినవి. కాని ఏమి చేయగలరు? అది రాజాజ్ఞ, ఆమె మీరంగరాని కడి.

ధర్మ కార్యముల కామె విరివిగా ధనము వెచ్చించు చుండెను. రాజ ప్రాసాదమునకు దాపున చెన్న మల్లికార్జ నుని యాలయ మొండు కట్టింప తలపెట్టి; అక్కమ్మ తన మనోరధమును రాజునకు తెలుకపరిచెను అందులకు కౌశికుడు సమ్మతించి ఆమె కోరిక మేరకు దేవాలయము కట్టింప మంత్రిని నియమించెను ఎవ్విధముననైనను ఆమెను తృప్తిపరచి తానింపుక సుఖింపదలచి యామె యిష్టానుసారము ప్రభువు నడచుకొనుచుండెను

కౌశిక్షు దివ్య మురియాడు మనసుతో నెల్ల వేళల ఆలో చనా మందిరమున కూలబడి శుష్కీభూతుడగు చుండెను;

మంత్రి ప్రభుని స్థితినిగాంచి తల్లడపడు మనముతో నతనికడ కేగి, నమస్కరించెను.

రాజటకు వచ్చిన మంత్రిగాంచి చింతతో "మంత్రి పుంగవా! యిటకేల వచ్చితివి? స్వయంకృతాపరాధమునకు దగిన శిక్ష ననుభవించుచు విరహాగ్నికి ఇంధనమునై తపించుచున్నా"నని తలవాల్చి పలికెను.

అందుకు మంత్రి "ప్రభూ! దుఃఖింపవలదు. నేనొక్క మాట మీకు చనువు బలిమిని చెప్పవచ్చితిని. క్షమియింపుడు కొంతకాలము మీరు ప్రచ్ఛన్నముగ శాంతినాథాశ్రమమున నుండిన సర్వము చక్కబడు"నని నుడువ, కౌశికుడందులకు సంతసించి, మరునాడే యచ్చటికి పయనమై పోయెను.

౧౦

అక్కమహాదేవి తన నియమప్రకార మనుదినము జంగమార్చనాది కార్యములు చేయుచుండెను.

చూపోవని కొందఱు ఆమె చేయు సత్కార్యములను దుష్కార్యములుగ చిత్రించు నుద్దేశముతో శాంతినాథాశ్రమమున నున్న కౌశికుని కటకేగి, యామెపై లేనిపోని కొన్ని న్నూరిపోసి, రాజు మనసు విఱిచివైచిరి.

కౌశికుడామె పవిత్ర జీవితములు తెలిసికొనజాలక, సూచకజనుల మాటలు నమ్మి, ఆమె శీలమును పరీక్షించు కొఱకు ఆశ్రమము వీడి, హుటాహుటి నడల నగరు కరు దెంచెను.

అప్పటికి అక్కమహాదేవి గృహమందు జంగమార్చన శివపూజాదులు ముగియుటచే జంగములు, శివశరణులు కడు పారభుజించి, పొట్టలు నిమురుకొనుచు వెలుపలికి వచ్చుచుండిరి. అదిచూచి, కౌశికునకు మరిసినపుండుపై నువ్వుచెల్లినట్లయ్యెను. కాని ఏమిచేయగలడు? ఇచ్చినమాట తప్పరెట్లు తప్పిన, చేజిక్కిన పదార్థము జారిపోవునను భీతి యొకవైపున హృదయకుహరమును గాయపరచుచుండెను. అటు - ఆశ్రమము నందును, ఇటు - ఇంటియందును మనసునకు శాంతి లేక, కౌశికుడప్పుడు రెంటికిం జెడ్డ రేవడయ్యెను. ఈ మనో వైకల్యము నించుకమఱచి, కొంతసేపైన శాంత చిత్తముతో నుండవలెనన్న అతనికి తగిన యౌషధము మద్యమె. దానిని సేవించిన ఆ విషయము పట్టపుదేవియు, పరిచారకులును గుర్తించి, రాజునకు వెలలు కట్టుదురు. ఏమిచేయుటకును - ఎట్లు గుర్తించుటకును తోపక కౌశికు డరియాడుమనముతో నుండెను.

అంతలో నప్పటికి వచ్చిన వాది కౌశికుని స్థితినిగాంచి చింతిల్లి, రాజును చెంగటనున్న తన యింటికి దోడ్కొని

పోయి కూర్చుండజేసి యతని దురాగ్రహమును కామోద్రే
కమును ఇంచుక శాంతింపజేయ తలపెట్టి తాను అక్కమహా
దేవి గృహమునకేగి ఆమెకు ప్రభువుదుస్థితిని దెలిపి ఆమెను
రాజుకడకు పిలిచికొనిపోయెను.

లోకవ్యవహారము ననుసరించి తనకు పతియై కౌశికుని
గాంచి యామెయు మనమున విచారపడి, యిట్టి తుచ్ఛ విష
యములపై మనసుంచి కృశించుటకంటె ఆ జినస్వామి పద
కమలములను సేవించి ఇహలోక సుఖ మబ్బుటయెగాక,
అంతమున పరమపదము ప్రాప్తిగదా యని తలపోసి ఆ
భావము సూచించు గీతమును కర్ణరసాయనముగ గానము
చేసెను. ఆమె గానమాధురి కౌశికు చొక్కి చెంతనున్న
మధుపాత్ర నందుకొని గుటగుట త్రాగివైచి స్పృహతప్పి
పడెను.

అంత దాది వలన సర్వమెఱిగిన మంత్రి అక్కమహా
దేవితో మాట్లాడదలచి ఆమె గృహమునకేగి అతిథిపూజలలో
మగ్నయైయున్న యామెను వెలుపలికి బిలిచి అపటి రాజు
స్థితినిగూర్చి యామెను చెవిలో రహస్యముగ జెప్పెను.

అప్పుడామె సచివునిగాంచి "మంత్రివర్యా! నే నిప్పుడే
యటనుండివచ్చి జంగమార్చనలో నిమగ్ననైతిని. నే నెట్లు
రాగలను? అది ముగిసినతోడనే రాజును చూడ మరల

వత్తును. అంతదనుక వారి క్షేమమరయ దాది కలదుకదా?" అని పలికెను.

ఆ పలుకులువిన్న మంత్రి సహింపజాలక "మహాదేవి! నీ మాటలు చోద్యముగ నున్నవి, పతియె సతికి దైవమని శాస్త్రములు ఘోషించుచుండ నీ విట్లాడదగునా? వీరందఱు పతి తరువాతివారే కదా? కుత్తుకబంటిగ భుజించిపోవుటకు నిన్నాశ్రయించినవారు. ఇప్పటికే నీకు చెడ్డపేరు వచ్చినది. ఇంకను లోకమునకేల చెడ్డదాన వయ్యెదవు? నీవి యుర్చనాదులు విడిచి వెంటనే రాజు సన్నిధికి రావలయు" నని నిక్కచ్చిగ బలికెను.

ఆ మాటలకు అక్కమహాదేవి "మంత్రివర్యా! మహారాజు నెడ నే నెన్నడును ఉదాసీనత చూపలేదు. శివయుం వటుడని మాత్రము విచారపడిని మద మాత్సర్యయుక్తుడగు నతడు లింగధారియైనను నాకు పూజనీయుడు కాడు. అట్టివాని యెడ నే నెన్నడును గౌరవము చూపలే"నని నెను.

ఆమె పలుకులకు ముదమొంది మంత్రి 'ఆహా! ఈమె పలుకు లెంత ధర్మయుక్తములు! ఎట్టి శీలవతి! నిజముగా నీమె సద్గృహిణి ఈమె మనసెరిగి వర్తించు బుద్ధి మహారాజు నకు లేకపోయె'నని మనమున జింతించుచు నతడు మెల్లగా జాఱుకొనెను.

అది మహారాజు చెవి నిల్లుకట్టుకొని బోధించిన బోధలకు ఫలముగా — ఏ జంగముడును, ఏ శివశరణుడును అక్కమహాదేవి యింటిగడప త్రొక్కరాదని ప్రభువు కఠినముగ శాసించెను,

అది తెలిసి, మహాదేవి ప్రభువునకడకేగి, తాను పొందిన వాగ్దానములలో రెండవది భగ్నమాయెనని రాజునకు దెలిపి తానేగెను.

హితవచనములు చెప్పుకొలదిని రాజునకు అక్కమ్మయెడ క్రౌర్యము హెచ్చుచొచ్చెను. అతని క్రూరత్వమును సహింపజాలక—కట్టుబాట్లకు లోబడి యుండలేక, ఆమెకు సంసారముపై రోతపుట్టెను. ప్రభునకు ఇష్టదైవమగు జినస్వామి యెంతటి త్యాగమూర్తి-ఎంతటివిరాగి! అట్టి మహనీయు నాశ్రయించిన ప్రభుం కిట్టి దుర్వర్తన మలవడుట వింతయని యామె మనమున జింతించి, అతనిని సన్మార్గమునకు ద్రిప్ప యత్నించి యత్నించి విఫలయయ్యెను

ఆమె యెడ కౌశికుని కెంత క్రౌర్యమో — ప్రజలకంత గౌరవము. ఎన్ని కష్టములు వచ్చినను ఆమె జనక పెద్దల యాశీస్సుల వలనను, మల్లికార్జునుని కృపాతిరేకమునను తన మతధర్మములను - ఆచారములను విడువక యాచరించుచుండెను.

తన్ను వివాహమాడిన పడతి తనచేజిక్కక సర్వదా జంగమ పూజాతత్పరయై యుండుటను జూచి సహింపనోపక కౌశికుడామె నెట్టులేని మానభంగ మొనర్చి కసి తీర్చిన నుద్యుక్తుడయ్యెను.

ఒకనాడు అక్కమహాదేవి పూజాగృహమున యోగ ముద్రావస్థ నుండెను. ఆ సమయమున కౌశికుడందుజొచ్చి, ఆమె యపూర్వసౌందర్యమునకు ముగ్ధుడై 'మహాదేవి' యని సంబోధించెను.

అందులకు ధ్యానమగ్నయై మైమరచియున్న అక్కమ్మ బదులాడలేదు. అంతరాజు కోపించి, యామెను పలుతెఱగుల బెదరించెను. శివధ్యానైక చిత్తురాలగు అక్కమ్మ నా బెదరింపు లేమి చేయగలవు ?

అతడంత మితిమీఱిన కోపముతో మానభంగ మొనర్ప నిశ్చయించి మెల్లమెల్లగా ఆమెను డాయబోయెను. అప్పుడామె యించుకయు భీతిల్లక ప్రశాంత చిత్తముతో నట్టులే కూర్చుండి యుండుటయు గాంచి కౌశికుడేమియో ప్రల్లదము లాడెను.

ఆ వగపోతుల కామె యోర్వజాలక "మహారాజా ! పలుమాటలు పలుకనేల? అలంకృతనైన నన్ను జూచి యేల మోహపడెదవు ? ఇది యశ్వాసపు సొబగు ఝరీతరంగతుల్యము-

శాశ్వతము కాదు. అదియుగాక శివోచ్ఛిష్టము ఉచ్ఛిష్టము నాశించువారు కలరే"? యని హెచ్చరించెను.

కామోద్రిక్తుడై కన్నుగానక యున్న కౌశికుని కా మాటలు రుచింపక చెంగున నెగిరి యామెను తన బాహువల్లికలతో బంధించెను. అప్పుడామె మెలకువతో పట్టు తప్పించుకొని దిగంబరయై నిలువబడెను. మహారాజామె నగ్న దేహమును గాంచి సిగ్గిలి కన్నులు మూసికొనెను.

తోడనే అక్కమహాదేవి ఆ దిగంబర దేహముతో "నీవొసగిన మూడు వరములు తప్పిన కారణమున నేనిట నిలువనొల్లక చెన్నమల్లికార్జునుని జేరబోవుచున్నా" నని మహారాజునకు దెలిపి రాజవీధిని బడెను, ఆశ్చర్యమగ్నులై యెల్ల రామెను కనులప్పగించి చూడదొడగెను,

౧౧

అట్లు దిగంబరయై బయలుదేరిన అక్కమహాదేవి కల్యాణపట్టణమునకేగి బసవేశ్వరుని దర్శించు తలంపుతో శివుని ధ్యానించుచు నడవులబడి పోవుచుండెను.

మార్గమధ్యమున నగ్నావస్థనున్న యా మహాదేవిని గాంచినవా రామెను గూర్చి పెక్కు తెఱగుల మాటాడుకొన జొచ్చిరి. సామాన్యులామెను హీనముగ దలచిరి. వరబ్రహ్మ

వాడు లామెను శుద్ధ విరాగిని యని పొగడిరి. పలుగాకులగు లోకుల మాటల నామె లెక్కగొనక దూషణ భూషణముల నామె సమముగా భావించుచు పయనము సాగించి ఊరు పల్లెలు కడచి కడచి బసవతీర్థము చేరి యందు స్నానాదులు తీర్చుకొని కల్యాణ పట్టణమునకు బోవ సంసిద్ధ యగు నంతలో నచ్చటి బెక్కండ్రు శివ శరణులు వచ్చి యా మహాదేవిని పరీక్షింప దలపెట్టిరి. కాని యామె వారి పరీక్షల కించుకమాత్రము బెదర లేదు.

అంతలో నచ్చట - కల్యాణ పురమున - అనుభవ మంటపమున జేరి యుండిన శివశరణులు అక్క మహాదేవి వచ్చుచున్న వార్త తెలిసి చక్కగా పరీక్షించి గాని యామెకందు ప్రవేశ మీయరాదని నిశ్చయించి యందులకు దగిన వారల నియమించిరి,

నిర్ణీతులంత ఆ మహాదేవి వచ్చు మార్గమున జేరి ఆమెను పెక్కువిధముల పరీక్షించి విఫలురై క్షమింప వేడుకొనిరి, ఆమె యందుల కించుకయు కోపపడక వారి యవివేకమునకు చింతించి జ్ఞానోపదేశము చేసి కల్యాణపురమున కేగెను, ఆమె గుణవిశేష మెఱిగిన పెద్దలచ్చట నామెకు బ్రహ్మరథము పట్టిరి ఆమె యందుల కించుకయు నుబ్బక 'అంతయు నీశ్వరేచ్ఛ' యనుకొనెను.

అంతకుమున్నె వారెల్లరు అనుభవ మంటపమున, శూన్య సింహాసనాధీశ్వరుడగు అల్లమ ప్రభువు సమక్షమున నామె శీలమును గూర్చి కూలంకషముగ చర్చింప నిర్ణయించుకొని యామె నామంటపమునకు దోడ్కొని పోయిరి.

ఆ మహాదేవి మంటపము ప్రవేశించిన తోడనే శైవ శాస్త్రానుసారము విధుల నాచరించి, యెల్లర ప్రీతికి పాత్రురాలయ్యెను.

ఆ సాయంకాలమె భక్తులామెను అమృత కుండమునకు బిలిచికొని పోయిరి. అది నిజముగా అమృత కుండమే! ఆ సరోవరమున కెదురుగా నీశ్వరాలయము కలదు. ఆమె యాకుండమున స్నానమాడి, ఆ పరమేశ్వరుని మనసార ధ్యానింప ననువగు నన్ను గావించిన యతడు బసవన్నయే! అట్టి పవిత్రస్థలమున శివపూజ కనుకూల్యము కలిగించుటయె కాక, శివశరణుల దర్శన భాగ్యము లభింప జేసినందుల కామె యెంతయు సంతసించెను. ఆమె యచ్చట సర్వేశ్వరుని పూజించుచు కొంత కాలము గడపెను.

౧౨

అక్కమహాదేవి యే యుద్దేశముతో భువి నవతరించెనో - అది నెఱవేఱు సమయ మాసన్నమైనది.

ప్రభువు నాజ్ఞానుసారము శివశరణులు గొందఱు అక్కమహాదేవిని అనుభవ మంటపమునకు దోడ్కొనిపోయిరి. అందలి శూన్యసింహాసనము నల్లమప్రభువు దేదీప్యమానముగ వెలుగొందుచుండెను. శివశరణులు వారి వారి స్థానములందు గూర్చుండియుండిరి. అక్కమహాదేవి చేతులు మోడ్చి, ప్రభువున కెదురుగా నిలువబడెను. అంతట నామెకును ప్రభువునకును ప్రశ్నోత్తరము లారంభమయ్యెను. మహాదేవి యొసగిన యుత్తరములకు ప్రభు వాశ్చర్యచకితుడై మందహాస మొనర్చెను. అందలి భావమెఱిగినవాడా సభయందలి బసవేశ్వరుడొక్కరుడే! ప్రభువు సంతృప్తుడై యానాటికి సభను జాలించి గృహమున కేగెను

అంతట భక్తులు అక్కమహాదేవిని బసవేశ్వరుని ప్రసాదనిలయమునకు దోడ్కొనిపోయిరి. అందు ఎప్పటివలె జంగమ దాసోహము జరిగెను. అది ముగియగనే అక్కమహాదేవిని ప్రసాదమునకు పిలిచిరి. అందులకామె తానింకను మూడు దినములు నిరాహారగా నుండవలెనని చెప్పెను. ఆ మాటకు బసవేశ్వరుడు 'వలె' యని, యామెను అమృతకుండమునకు దోడ్కొనిపోవ నాజ్ఞ యొసంగెను. తోడనే, శరణులామెను అచ్చటికి దోడ్కొని పోయిరి.

అచ్చట, అక్కమహాదేవి శివశరణులను భక్తితో బూజించి. ప్రసాదమిచ్చి, తాను ధ్యానమగ్న యయ్యెను.

మూఁడునాఁడును నిన్నటివలెనే మరల అనుభవ మంటపమున చర్చ ప్రారంభమయ్యెను. నాఁడు సదస్యుల సంఖ్య యినుమడించెను. ప్రశ్నలకు తగు నుత్తరములిచ్చి. ఆ దినమును అక్కమహాదేవి యతుల మన్ననకు పాత్రురాలయ్యెను. అట్లు మూఁడవదినమును చర్చసాగి, ఆమె పుటము పెట్టిన బంగారమువలె నిగ్గుదేలెను. అల్లమప్రభు వామె నిష్కల్మష శీలమునకును - నిరాడంబర జీవితమునకును మెచ్చి, యాశీర్వదించెను. ఆ క్షణమునుండియు కల్యాణపట్టణవాసు లామెమాటను వేదవాక్యముగ భావించి, అడుగులకు మడుగులొత్త దొడగిరి.

అట్లు పరీక్షలన్నియు ముగిసినపిదప, అల్లమ ప్రభువు అక్కమహాదేవిని గాంచి, "నీ వొసగిన యుత్తరములకు మెచ్చవచ్చును. నీవు నిష్కళంక చరిత్రవు. నీ వచ్చిన పని పూర్తియైనది. నీ విటనుండి కదలి, తూర్పు దిక్కుగా పయనింతువేని 'శ్రీశైల' మను పర్వతరాజము గోచరించును దాని లోయయందొకచో కదళీ వనము గలదు, నీ వందు జేరి, ధ్యానమగ్నవై, యీ దేహమును వీడి శ్రీ చెన్నమల్లికార్జునుని చేరు" మని యాశీర్వదించెను.

అందులకు అక్కమహాదేవి సంతసించి, ప్రభువునకు సాష్టాంగ మెరగి, శివ శరణుల సెలవు గైకొని, కల్యాణ పట్టణము వీడి, శ్రీశైలము త్రోవ పట్టెను.

అట్లామె పయనించి పయనించి, శ్రీనగము జేరి, అందు వేంచేసియున్న మల్లికార్జునుని పాదారవిందములకు భక్తితో ప్రణమిల్లి, ఆ పరమేశ్వరుని పెక్కు తెఱగుల కీర్తించుచు నచ్చోట మూడు దినములు గడపెను.

అంత నామె దైవాజ్ఞచే నచ్చోటు విడిచి, కదళీవనము జేరి, యందుసమాధి నిష్ఠనుండి, పాంచభౌతిక దేహమును వీడి పరమేశ్వరునిలో లీనమయ్యెను.

ఆహా! ఏమి యామె పవిత్ర చరిత్ర! అట్టి భక్తురాండ్ర యునికిచే భారతావని పునీతమైనది.

సర్వేజనా స్సుఖినో భవంతు



జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్, గుంటూరు-2. ఫోన్ : 21907